Morning Edition

# ఆంధ్రపత్రిక

The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 112 FRIDAY 22nd JULY 1949 వెల ఒకఅణా { Founder: K.NageswaraRao





37629

# కాందిశీకుల ఆస్తి సేకరణ సమస్య: పాకిస్థాన్ ప్రభుత్వ వైఖరిపై విమర్శ

## కాశ్మీర్ యుద్ధ విరమణ సరిహద్దు నిర్ణయ సమస్య

### కరాచీ చర్చలలో మరికొన్ని అంశాలపై ఏకీభావం

కరాచీ, జులై 21: ఇండియా పాకిస్థాన్ సైనిక ప్రతినిధులు ఈవేళ ప్రొద్దున 3 గంటలసేపు చర్చలు జరిపి, ప్రతాణా సమీపంలో వున్న 2 కీలక స్థావరముల ఆక్రమణ విషయంలో లోగడ వచ్చిన వివాదపై సమాధానమునకువచ్చిరి. ఈ రెండుస్థావరములు, భారతీయ సైన్యములు ఆక్రమణక్రిందవున్న మేరలోకి రావని ఉభయపక్షములు అంగీకరించుకున్నవి. రెండు రోజులక్రిందట జరిగిన సమావేశంలో ఏ అంశములపై వివాదాలు వచ్చినవో ఆ మూడు అంశములలో రెంటిమీద ఈవేళ పై చెప్పినవిధంగా సమాధానం కుదిరింది.

యుద్ధవిరమణో త్తర్వు జారీ చేసిన రోజున అనగా ఈ సంవత్సరం జనవరి 1 వ తేదీన భారతీయ సైన్యముల ఆక్రమణ క్రిందఉన్న స్థావరములేవి? పాకిస్థాన్ ఆక్రమణక్రింద ఉన్న స్థావరము [illegible] ... వలసిన విషయంకాదనీ, ఏ స్థావరాలు ఎవరి ఆక్రమణక్రింద ఉన్నవి అన్న విషయం కొంచెం శ్రద్ధగా విచారిస్తే ఎవరికైనా తెలియకపోదనీ, భారతీయ ప్రభుత్వ ప్రతినిధులు పట్టుదలగా వాదించిరి.

### నూలు గుడ్డలపై ఎగుమతిపన్ను రద్దు

#### స్వేచ్ఛగా ఎగుమతికి ప్రభుత్వ అనుమతి

న్యూఢిల్లీ, జులై 21: కుట్టు దారం, దోమతెరలు, 20,40 నెం బర్ల మధ్యరకంనూలు తప్ప మిగతా నూలు గుడ్డలన్నీ ఎగుమతిపన్ను లేకుండా స్వేచ్ఛగా ఎగుమతి చేసుకోవచ్చునని భారతప్రభుత్వం నిశ్చయించినట్లు తెలుస్తున్నది.

## కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల అధికార జాబితాల నిర్ణయం

### రాజ్యాంగ రచనా సంఘంతో రాష్ట్ర సంస్థాన ప్రధానుల చర్చలు ప్రారంభం

న్యూఢిల్లీ, జులై 21: రాష్ట్ర, సంస్థాన ప్రధానులు ఈవేళ రాజ్యాంగ ముసాయిదా సంఘంతో సమావేశమై, కేంద్ర అధికార, రాష్ట్ర అధికార సమిష్టి అధికార జాబితాలకు ముసాయిదా సంఘం ప్రతిపాదించిన సవరణలనుగూర్చి చర్చించిరి. నేడు సమావేశం దాదాపు 5 గం. సేపు జరిగింది.

ప్రధాన మంత్రి పండిట్ నెహ్రూ, ... [illegible]

రాష్ట్రములలోను ఉన్నత విద్యానిర్వహణ విధానములను సమన్వయ పరచడము; యావద్భారతదేశం దృష్ట్యా ప్రధానమైన కొన్ని ప్యాక్టరీలలో వివరంగా లెక్కలు, అంచనాలు పోగుచేయించే అధికారము; నదీ ప్రాజెక్టులు; బహు రాష్ట్రములగుండా ప్రవహించే నదులలోని జలము పద్ధతిని యోగం చేయ్యటం వరదలను అరికట్టడం; సాగు సౌకర్యములు, నదీయాన సౌకర్య... [illegible] ... టుచేసే జాతీయ ప్రాధాన్యం గల సంస్థలుగా నిర్ణయించబడే ఇతర విద్యాసంస్థలు; భారత ప్రభుత్వ పోషితమైన సైన్టిఫిక సాంకేతిక విద్యాసంస్థలు; దేశమంతటా ఉన్నత విద్యా ప్రమాణములను ఒక నిర్ణీత స్థాయికి తగ్గకుండా చూసే బాధ్యత; వివిధ ... [illegible]

... ప్రాథమిక చర్చలేగాని అంతిమ చర్చలు కావు. బ్రిటన్నుండి డా॥ మత్తయ్ ఢిల్లీకి తిరిగివచ్చినతర్వాత, జులై 24 వ తేదీన ఆయన సమక్షంలో అంతిమ చర్చలు జరుగుతవి. ప్రధానమంత్రిపండిట్ నెహ్రూ శనివారంనాడు వివిధ రాష్ట్రసంస్థాన ప్రధానులను సమావేశపరచి, దేశ ఆంతరంగిక పరిస్థితి, ఆహారసమస్య, మొదలు గాగల ప్రధాన వ్యవహారముల గూర్చి చర్చించగలరని తెలియుచున్నది.

## ఆహార సలహాదార్ల సంఘ సమావేశం

### రాష్ట్ర ఆహారమంత్రుల సభా కార్యక్రమంపై చర్చలు

బొంబాయి, జులై 21: భారతప్రభుత్వపు ఆహారసలహాదార్ల స్థాయీసంఘం ఇవ్వాళ తన రెండురోజుల సమావేశాన్ని ప్రారంభించింది. ఆహారశాఖా మంత్రి జయరాందాస్ దౌలత్రాం హాజరుకాలేక పోయినందున శ్రీ యన్. జి. రంగా అధ్యక్షత వహించిరి.

కేంద్రశాసన సభ్యులతోకూడిన ఈ సంఘం ఆగస్టు 1, 2 తేదీలలో ఢిల్లీలో జరుగబోయే రాష్ట్ర ఆహారమంత్రుల సమావేశానికి ఏమి కార్యక్రమముండాలో చర్చించింది. వివిధరాష్ట్రములలో అధికోత్పత్తి కార్యక్రమం ఏవిధంగా సాగుతున్నదీ రాష్ట్రప్రభుత్వాలు పంపిన నివేదికలమీదకూడా చర్చలుజరిగాయి.

### ఒకరాష్ట్రంనుంచి మరొక రాష్ట్రానికి ఖైదీల మార్పుకు ఆర్డినెన్సు

న్యూఢిల్లీ, జులై 21: ఒకరాష్ట్రంలో ప్రజాశాంతి రక్షణచట్టం క్రింద నిర్బంధింపబడిన వారిని మరొక రాష్ట్ర ప్రభుత్వం ఇష్టపడితే ఆరాష్ట్రానికి బదిలీ చేయుటకు వీలుకలుగజేస్తూ గవర్నరు-జనరల్ ఒక ఆర్డినెన్సును జారీచేశారు. ఈ ఆర్డినెన్సు సంస్థానాలకుకూడా వర్తిస్తుంది.

### బర్మాకు కామన్వెల్తు మిలిటరీ సహాయం

#### నోయెల్‌బేకర్ ప్రకటన

లండను, జులై 21: బర్మాకు కావలసిన మిలిటరీ సహాయాన్ని ఇవ్వడానికి ఏర్పాట్లు గాగానే జరుగుతున్నాయని బ్రిటిష్ కామన్వెల్తు శాఖామంత్రి నోయెల్ బేకర్ నేడు కామన్సులో చెప్పాడు. ఇండియా, పాకిస్థాన్, సింహళములు బ్రిటిష్ ప్రభుత్వంతో కలిసి చేస్తామన్న ఆర్థికసహాయాన్ని బర్మా ప్రస్తుతం ఉపయోగించుకోవటానికి కిష్టపడటం లేదనికూడా అతడు చెప్పాడు.

### "క్షమా కాళీ, మహంకాళీ" హైదరాబాదులో మోసగాళ్లు

హైదరాబాదు, జులై 21: ఈ నగరంలో కొందరు మోసగాళ్లు బయలుదేరి అమాయకులవద్దనుండి మాయచేసి కరెన్సీనోట్లను దొంగిలిస్తున్నారనీ, మాయనోట్లు తెప్పిస్తామని "క్షమా, కాళీ మహంకాళీ" అంటూ చల్లగా జారిపోతున్నారనీ, కనుక జాగ్రత్తగా వుండవలసిందని ప్రభుత్వం ప్రకటనచేసింది.

## పునరావాసశాఖ యాజమాన్యాన ఢిల్లీలో అనధికార చర్చలు

### కరాచీ ఒప్పందం భగ్నతకు పాకిస్థాన్ విపరీత ధోరణే కారణమని గోపాలస్వామి అయ్యంగార్ వివరణ

న్యూఢిల్లీ, జులై 21: కరాచీ సంప్రదింపులు భగ్నమైన కారణంగా, కాందిశీకుల ఆస్తివ్యవహారముల విషయమై ఇకముందు తీసుకొనవలసిన చర్యలను గురించి కాందిశీకుల నాయకుల అభిప్రాయాన్ని తెలుసుకునేందుకుగాను భారత ప్రభుత్వ కాందిశీకమంత్రి వర్గంవారు యేర్పాటుచేసిన సమావేశంలో కరాచీ సంప్రదింపులకు ప్రతినిధివర్గ నాయకులుగా వెళ్లిన య్ర్. గోపాలస్వామి అయ్యంగారు పాకిస్థాన్ ధోరణిని విమర్శిస్తూ ఇలా ప్రసంగించారు:

"కరాచీ సంప్రదింపులు భగ్నంకావటానికి భారతదేశం కారణమనే అనూత వాదంపట్టి అబద్ధం. ఆ బాధ్యతంతా పాకిస్థానుదే. పాకిస్థాన్ చేస్తున్నది కట్టిదిలిపి ప్రచారం.

"ఈ సమస్యను పరిష్కరించటానికి భారతదేశం చాలా తీవ్రంగా ప్రయత్నించింది. ... [illegible]

### శక్సేనా ప్రసంగం

... రక్షణార్థుల పునరావాసంవంటి సమస్య "న భూతో న భవిష్యతి" అని మంత్రి మోహన్లాల్ శక్సేనా చెప్పారు. ఈ సమస్య ఇండియా, పాకిస్థానులమధ్య స్నేహం ఏర్పడకుండా చేస్తున్న అంశాలలో ముఖ్యమైనదనీ, దీని ప్రాముఖ్యతను తాము అనేకసార్లు పాకిస్థానుకు నచ్చచెప్పామనీ కూడా ఆయన అన్నారు.

"రక్షణార్థుల ఆస్తులను ప్రభుత్వాల స్థాయిలో మార్చుకోవటం ఉత్తమ మార్గమని భారత ప్రభుత్వం ఆదినుంచీ అభిప్రాయ పడుతున్నది. ఈ స్కీముక్రిందకు అన్నిరకాల ఆస్తులను చేర్చకపోవడంవల్ల భారత ప్రతినిధులు కొంత అసంతృప్తి పడ్డారు. కాని తరువాత ఒప్పుకున్నారు. గత డిసెంబరులో జరిగిన కరాచీ ఒడంబడిక ఏకపక్ష వ్యవహారం మాత్రమే. ఈఒడంబడికవల్ల రక్షణార్థుల ఆస్తిని అమ్ముకొనడానికీ, మార్చుకోడానికీ వీలైనది, దీనికి భారతప్రభుత్వం అంగీకరించింది. కాని పాకిస్థాన్ ఎప్పటికప్పుడు ఈఒడంబడికకు అంతరాయాలు కల్పిస్తూనే వున్నది. పైగా రక్షణార్థుల ఆస్తులన్నీ ప్రభుత్వానికే చెందుతాయనీ, ... [illegible]

ఇకముందు చేయవలసిన కర్తవ్యాన్ని గూర్చి ... [illegible]

## మధ్యప్రాచ్య రక్షణపై బ్రిటన్‌లో ప్రధాన చర్చలు

లండన్, జులై 21: మధ్య ప్రాచ్యంలో బ్రిటిష్ రక్షణ విధానాన్ని సమీక్షించడానికి ఈ వేళ ఇక్కడ అత్యంత ప్రధానమైన సమావేశం ఒకటి జరిగింది; ఈ సమావేశంలో బ్రిటిష్ వైమానికసేనా నాయకులు, సైన్యాధిపతులు, మధ్యప్రాచ్య దేశములలోని బ్రిటిష్ రాయబారులు పాల్గొనిరి. ఈ సమావేశం 5 రోజుల పాటు జరుగుతుంది.

మధ్య ప్రాచ్యంలో కమ్యూనిజమ్ను ప్రవేశించనివ్వకుండా అరికట్టడం; మధ్య ప్రాచ్య రాజకీయ ఆర్థిక అభివృద్ధి; ఇజ్రాయిల్, పాలస్తీనా కాందిశీకులభవిష్యత్తు; ... [illegible] ... సైరస్లో సేన్యాధి తేగ నాయకుడైన ఎమిర్ సయ్యద్‌లు ఇటీవలనే విదేశాంగ మంత్రి ఎర్నెస్ట్ బెవిన్‌ను కలుసుకొని మధ్య ప్రాచ్య స్థితిగతులగూర్చి చర్చించిరి; పై జెప్పిన మధ్యప్రాచ్య నాయకుల అభిప్రాయములను తెలుసుకొని వుండడం నేటి సమావేశంలో బెవిన్‌కు ఉపకరించింది. ఈ సమావేశం విదేశాంగమంత్రి బెవిన్ పర్యవేక్షణక్రింద జరుగుతున్నది. ట్రాన్స్‌జోర్డాన్ రాజైన అబ్దుల్లాకూడా వచ్చే నెలలో బ్రిటన్‌యొక్క విదేశాంగ మంత్రి బెవిన్‌తో చర్చలు జరుపగలడని తెలియుచున్నది.

## రజ్వీడిఫెన్సుకు లండన్ బారిస్టర్ రాకవార్త నిరాధారమైనట్టిది

### హైద్రాబాద్‌వర్గాల ఆశ్చర్యం: పరిస్థితిని వివరిస్తూ అధికార ప్రతినిధి ప్రకటన

హైదరాబాదు, జులై 21: కాశిం రజ్వీకి, లాయక్‌అలీ మంత్రివర్గంవారికి డిఫెన్సు సహాయం చేయటానికి జె. ఎ. రాబర్ట్సు అనే లండను బారిస్టరు హైదరాబాదుకు వస్తున్నారని కరాచీ నుంచి వచ్చిన వార్త ఇక్కడ అధికార వర్గాలలో చాలా ఆశ్చర్యం కలిగించింది.

ఎందుకంటే తన తరపున వాదించటానికి లండను బారిస్టరు కావాలని కాశిం రజ్వీ ఇంతవరకూ కోరలేదు. తనకు ఆఖరికి పాకిస్థాన్ నుంచి కూడా న్యాయవాదుల సహాయం అక్కర్లేదని, తన తరపున వాదించటానికి హైదరాబాదు న్యాయవాదుల సహాయం చాలుననీ రజ్వీ కొందరితోచెప్పి సూచించాడు. అతనికి ప్రభుత్వం డిఫెన్సు సదుపాయాలను పూర్తిగా ఏర్పాటు చేస్తున్నది.

కరాచీ నుంచి వచ్చిన వార్త అంతరార్థం భారత ప్రభుత్వం రజ్వీకి లండను నుంచి సమర్థమైన డిఫెన్సు సహాయం తెచ్చుకోనీకుండా అడ్డు పడుతున్నదనే దురభిప్రాయాన్ని ప్రజల్లో ప్రచారించాలనే నని అధికార ప్రతినిధి ఒకరు ఇక్కడ చెప్పారు. కాని రజ్వీ తాను కోరుకున్న న్యాయవాదుల సహాయమే పొందబోతున్నాడు కనుక ఈ ప్రయత్నం వ్యర్థమై పోతుందనీ, రాబర్ట్సు కరాచీకి ఏ సొంత పనిమీద వచ్చి వుంటాడుగాని, హైదరాబాదుకు మాత్రం రాబోవడంలేదనీకూడా ఆ ప్రతినిధి చెప్పాడు.

### కేసు విచారణ స్థలం

తిరుమల్ ఘర్రీలోని వాయుపు ప్రదేశ మిలిటరీ ఆస్పత్రిలో కాశిం రజ్వీని విచారించే ప్రత్యేక న్యాయస్థానం ఏర్పాటు చేయబడుతుందని అధికార రీత్యా నేడు ప్రకటింపబడింది. న్యాయస్థానం పగలు 11 గంటలకు ప్రారంభమవుతుంది.

## అట్లాంటిక్ రక్షణ ఒడంబడిక

### ఇటలీ ధృవీకరణ

రోమ్, జులై 21: అట్లాంటిక్ రక్షణ ఒడంబడికను ఇటలీ శాసనసభ నేడు ఆమోదించినది. 323 వోట్లు అనుకూలంగానూ, 160 ప్రతికూలంగానూ వచ్చినవి.

## పాకిస్థాన్ మంత్రివర్గ పునర్నిర్మాణసూచన

కరాచీ, జులై 21: పశ్చిమ పంజాబు గవర్నరుగా సర్దార్ అబ్దుల్ రబ్ నిష్తార్ నియమింప బడినందున, పాకిస్థాన మంత్రివర్గంలో మార్పులు జరగవచ్చునని తెలుస్తున్నది. నిష్తార్ స్థానంలో సంస్థాన శాఖా ఉప మంత్రి సర్దార్ బహదూర్ ఖాన్ నియమింపబడవచ్చునని అభిజ్ఞులు చెబుతున్నారు.

### అ. భా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు కార్యవర్గం

బొంబాయి, జులై 21: మద్రాసులో రేపు 23, 24 తేదీలలో సమావేశమయ్యే అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు కార్యవర్గం పారిశ్రామిక కార్మికులలో పెరిగిపోతున్న నిరుద్యోగ సమస్యనుగూర్చి చర్చించి పరిష్కార మార్గాల నాలోచిస్తుంది.

## దక్షిణ కొరియాలో దూరప్రాచ్య రక్షణ సమస్యపై ప్రధాన చర్చలు

మనీలా, జులై 21: జనరలిస్సిమో చాంగ్ కై షేక్‌తో సమావేశానికి దక్షిణ కొరియా అధ్యక్షుడు డా॥ సింగ్మన్‌రీ, ఫిలిప్పైన్సు అధ్యక్షుడు క్విరినోను ఆహ్వానించినట్లు నేడు తెలిసింది. కాని క్విరినో ఈ సమయంలో ... [illegible] ... రాజ్య దూర ప్రాచ్య సంఘంలోని ఫిలిప్పైన్సు ప్రతినిధి కార్లస్ రోములో హాజరు కావచ్చునని, చాంగ్ కై షేక్‌తో సమావేశం ద. కొరియన్ రాజధాని సియోల్‌లో రెండు వారాలలోగా జరుగవచ్చునని ఫిలిప్పైన్సు విదేశాంగ ఉప మంత్రి వెల్లడించాడు.

## గంటల పంచాంగం

విరోధి నం॥ ఆషాఢ బ॥ ద్వాదశి
1949 సం॥ జూలై 22 శుక్రవారం
శు॥ ద్వాదశి తె 5-1 గో ప 3-35 వర్జ్యతి
ఉ 7-12 ల 8-52 కు.

బ॥ త్రయో॥ జూలై 23 శనివారం
శ॥త్రయోదశి తె 4-19 మృ ప3-58 వర్జ్యం
రా 12-16 ల 1-51 కు.

ఆంధ్రపత్రిక
విరోధి నం॥ ఆషాఢ బ॥ ద్వాదశి
శుక్రవారం

## వ్యవసాయ మరమ్మతు

రాష్ట్ర శాసనసభలు జమీందారీ బిల్లును ఆమోదించి దాదాపు ...రము కావచ్చుచున్నది. ...ది ఎప్పుడు ఏ విధముగ అమలు జరుగునో రాష్ట్రరెవెన్యూ మంత్రికైనను తెలిసినట్లు కన్పింపదు. రాష్ట్రమునందలి ఎస్టేట్లన్నింటి సర్వే పూర్తి అయినట్లు కూడ తోచదు. పరిహారము చెల్లించు విషయమున రాష్ట్రప్రభుత్వ మింతవరకు ఒక నిర్ణయమునకు వచ్చియుండలేదు. న్యాయపాలన, కార్యనిర్వాహణ శాఖల విభజన విషయమునను ప్రభుత్వ నిర్ణయము ఇదేస్థితిలో నున్నది. జమీందారీ రద్దు బిల్లు ముందుగ కృష్ణాజిల్లాయందు అమలుకు రాగలదని ప్రకటింపబడినట్లు ఈ న్యాయపాలన, కార్యనిర్వాహణ శాఖల విభజన రెండు మూడు మాసములలో కొన్ని ప్రాంతములందు అమలు జరుగ గలదని ఇటీవలనె న్యాయశాఖామంత్రి వెల్లడించెను. స్థానికస్వపరిపాలనశాఖామంత్రి ప్రతిపాదించిన పంచాయతీ బిల్లు సెలెక్టుకమిటీ ఎదుటనున్నది. ఈ విధముగ అనేక సంస్కరణలకు సంబంధించిన శాసనములు, బిల్లులు పడియుండ రాష్ట్ర ప్రభుత్వమువారు ఇపుడు వ్యవసాయమును ఒక పరిశ్రమగ వృద్ధిచేసి 'రైతాంగమును, దేశ్యమును' సంస్కరింప సంకల్పించిరి. బిల్లు ఉద్దేశ్యములు - ఈ వారము ఫోర్టు సెంట్ జార్జి గెజెట్ లో బిల్లు వివరములు ప్రకటింపబడినవి - ఉదాత్తమైనవే. వ్యవసాయమును ఒక పరిశ్రమగ పరిగణింపవలెనను ఆలోచన ఇన్ని శతాబ్దములకైనను అధికారవర్గములకు కలుగుట సంతసింప తగ్గ విషయము. కాని వ్యవసాయాభివృద్ధికి ఈ బిల్లునందు ప్రభుత్వము సూచించిన మార్గములు ఎంతవరకు ఉపయోగపడ గలవు? ప్రభుత్వమనుసరింపదలచిన విధానము పట్టాదారులకు, కౌలుదారులకు, వ్యవసాయ కార్మికులకు ఎంతవరకు న్యాయము చేయగలదు? మొదలగు ప్రశ్నలకు వ్యవసాయశాఖమంత్రియైనను తృప్తికరమైన సమాధానములను ఇవ్వజాలరు.

1947 వ సంవత్సరములో అఖిల భారత కాంగ్రెసు ఆర్థికశాఖవారు చేసిన సూచనలను పురస్కరించుకొని బ్రిటిష్ వ్యవసాయ శాసనమును అనుసరించి తామీ బిల్లును తయారుచేసినట్లు ప్రభుత్వమువారు ప్రకటించిరి. ఈ రెండు సంవత్సరములలో అనేక మార్పులు జరిగినవి. భూమి అనుభవపు విధానము నసమూలముగ మార్చివేయుటకు అన్ని రాష్ట్రప్రభుత్వములు ... రణ సంఘములను నియమించెను. డా॥ రాజేంద్రప్రసాద్ కాంగ్రెస్ అధ్యక్షుడుగ నున్నపుడు జమీందారీల రద్దు అనంతరము జరుగవలసిన భూమి అమరికపు సంస్కరణల సూచించుటకు డా॥ కుమరప్ప అధ్యక్షులుగ వర్పడిన ఉపసంఘం ఈ వారము కార్యవర్గమునకు తమ నివేదికను సమర్పించి యుండిరి.

ఈ స్థితిలో వ్యవసాయమును మరమ్మతు చేయుటకు రాష్ట్ర ప్రభుత్వము పూనుకొనుట అంత సమర్థనీయముగ కన్పింపదు. పట్టాదారుగాని కౌలుదారుగాని వ్యవసాయమును చేయవలసిన తీరుగ చేయుట లేదని "అగ్రికల్చరల్ సూపరువైజరు" అభిప్రాయ పడిన ప్రభుత్వము కౌలుకు స్వస్తిచెప్పుటకుగాని, పట్టాదారుని తొలగించి ఆ పట్టాభూమిని స్వాధీనము చేసుకొనుటకు గాని ఏ న్యాయస్థానము అడ్డు చెప్ప లేదని ఈ బిల్లు నిర్దేశించుచున్నది. కౌళ్లు మార్చుటకు, పట్టాలను మార్చుటకు ఒక "అగ్రికల్చరల్ సూపరువైజరు"కు అధికారము నిచ్చుటవలన ఎట్టి ప్రమాదములు రాగలవో ప్రభుత్వము ఊహించినట్లు కన్పించదు.

"అసలు సమర్థతతో వ్యవసాయమును ఏ విధముగ చేయవలెను? ఎట్లుచేసిన అది సవ్యముగ చేసిన ట్లగును?" అన్నది బిల్లునందు స్పష్టము చేయబడలేదు. భూసారము చెడకుండ, పంట నాణ్యము పోకుండ సాధ్యమైనంత ఎక్కువధాన్యమునె పండించినను, మరొకరు, రసాయనిక ఎరువులను వేసి, ఇంకా ఎక్కువ పంటను పండించిన, ఇందు సరియైన పద్ధతిన సాగుచేసినవారు ఎవరని ప్రభుత్వాభిప్రాయము?

ఏ పంట పండించవలెనను విషయమునె గాక, ఆ పంటను ఏ విధముగ, 'ఎంత' పండించవలెను. అన్న విషయమును కూడ ప్రభుత్వమె నిర్ణయించి, ఆ నిర్ణయములను అమలుచేయును. ఏభూమిలో ఏ పంట పండునో "అగ్రికల్చరల్ సూపరు వైజర్ల"కు అయినను పూర్తిగ అంతుపట్టినదని చెప్పుటకు వీలులేదు. ఈ బిల్లు వ్యవసాయదారులకు ఎక్కువ పండించుటకు ప్రోత్సాహము నిచ్చుటకు బదులు పట్టాదారులకు-కౌలుదారులకు సంఘర్షణలను ప్రోత్సహించి, కొద్ది భూవసతి గల పట్టాదారులను పూర్తిగ తొలగించివేయుగలదు.

పంటకు న్యాయమైన, గిట్టుబాటైన ధరలను నిర్ణయించి ఆ ధరలు రైతులకు ముట్టునట్లు చేయుటకు ప్రభుత్వము చర్యలు తీసుకొనను న్నట్లు ఈ బిల్లు సూచించుచున్నది. ముఖ్యముగ ఈ సంవత్సరము అనేక ప్రాంతములందు రైతులు తమ ధాన్యమునకు ప్రభుత్వము నిర్ణయించిన ధరలను పొందలేక పోయిరి. అట్టి అన్యాయము జరుగకుండ ప్రభుత్వ మేమియు చేయలేక పోయెను. ఇక ప్రభుత్వము ఈ విధమైన సంస్కరణలను అమలు జరుపుటలో ఎంతవరకు విజయమును సాధింపగలదో చూడవలసియున్నది.

## రష్యా వైమానిక బలం

లండన్, జూలై 21: రష్యా తనవైమానిక బల వివరాలను రహస్యంగా ఉంచటం వల్ల ఇతర దేశాలవాళ్లు చాలా ఎక్కువగా ఉన్నట్లు అంచనా వేసుకుంటున్నారని ఒక బ్రిటిష్ వైమానికనిపుణుడు తెలియచేస్తున్నాడు. రష్యాకు 40 వేల విమానాలున్నట్లు ఒక అమెరికన్ నాయకుడు ప్రామాణికంగా ... 11 వేల ఉన్నట్లు తెలుస్తున్నదని, వాంచి ... విమానాలు 10 వేలకు ... ఉండవచ్చునని అంటున్నాడు.

# పట్టాదార్లను, కౌలుదార్లను తొలగించేందుకు ప్రభుత్వానికి అధికారం

## రాష్ట్రంలో వ్యవసాయమరమ్మతుకు ప్రభుత్వ చర్యలు: అధికార బిల్లు వివరాలు

మదరాసు, జులై 20: చెన్నరాజధానిలో జాతికి వలయు ఆహారమును ఎంత వుత్పత్తిచేయ వీలగునో అంత వుత్పత్తి చేయుటకున్నూ, ప్రజాక్షేమము వినియోగదృష్ట్యా ఇతర వ్యవసాయకోత్పత్తిని వృద్ధిచేయుటకున్నూ వ్యవసాయ పరిశ్రమను సౌష్టవము చేయుట అవసరమైనందున మదరాసు ప్రభుత్వము శాసనసభలో ఒక బిల్లును ప్రవేశపెట్టదలచినది.

సాగుచేయక బీడుగ వదలివేయబడిన భూములను స్వాధీనపర్చుకొనుటకు, సరియైన వుత్పత్తికిగాను అవసరమైనచోట మేనేజిమెంటును మార్పుచేయుటకున్నూ, ప్రభుత్వమువారి సూచనలు అమలుజరుగుచున్నదీ లేనిదీ పరిశీలించు సూపర్వైజర్లను నియమించుటకు, వ్యవసాయ పద్ధతులను పండించవలసిన పంట విషయమై సూచించుటకు, అవసరమని తలచిన భూమిని స్వాధీనమొనర్చుకొనుటకు ప్రభుత్వమునకు ఈ బిల్లువలన అధికారము లభించును. కొన్ని సందర్భములలో పంటకు న్యాయమైనధర బజారు హామీ ఇవ్వబడినది.

బ్రిటిష్ అగ్రికల్చరల్ బిల్లు నమూనాలో ఈ రాష్ట్రములో ఒక శాసనము చేయుట గురించి పరిశీలించ వలసిందని అఖిల భారత కాంగ్రెస్ ఆర్థిక పరిశోధన సంఘము 1947 ఫిబ్రవరిలో సూచన చేసినది. ఈ విషయమును పరిశీలించి రాష్ట్రపరిస్థితులకు అనుగుణ్యముగ మదరాసు ప్రభుత్వం ఒకబిల్లు ముసాయిదాను తయారుచేసినది. ఉద్దేశ్యము; కారణములను వివరించుచు ప్రజాభిప్రాయము నిమిత్తము బిల్లు ప్రచురించబడినది. ఈ సందర్భమున నవంబరు 1 వ తేదీలోగ మదరాసు ప్రభుత్వ ఆహారశాఖ కార్యదర్శికి అందు ఆక్షేపణలు, విమర్శలు ప్రభుత్వము వారిచే పరిశీలించబడును.

బిల్లుయొక్క ఉద్దేశ్యములు, కారణములలో ఇట్లు తెలుప బడినది:—

వ్యవసాయము రాష్ట్ర ఐశ్వర్య, అభివృద్ధికి ప్రధానమైనటువంటి ప్రాతిపదిక పరిశ్రమ అయియున్నది. అయినప్పటికీ ఈ పరిశ్రమ ఇంకనూ రైతుల పూర్వసాంప్రదాయము ననుసరించి జరుగుతూ అభివృద్ధికరమైన సంస్కరణఏమీ జరుగలేదు. వ్యవసాయమును శాస్త్రీయపద్ధతులపైన జరిపించవలసిన సమయంవచ్చినది. ఇదిగాక చాలా భూమి బంజరుగను, బీడుగను వదలివేయబడుచున్నది. ప్రజల ఉపయోగమునకుగాను ఈ భూములను సాగులోకిందికి తీసుకొనివచ్చుట చాలా అవుసరం. సాగుచేయబడుచున్ననూ లాభాపేక్షవల్లనైతేనేమి, సాధనసంపత్తి లేకనేమి, అజ్ఞానమువల్లనైతేనేమి ఆహారపంటలు పండించక పోవుటవలన రాష్ట్రములో తీవ్రమైన ఆహారకొరత ఏర్పడినది. భూముల సాగును సమున్నతతో చేయించుటయేగాక ఫలానా పంటనే పండించవలెనని ఆదేశించుట అవసరముగ తోచుచున్నది. ఏ భూమి సాగు అయినా సమున్నతతో జరుగని యెడల మేనేజిమెంటును మార్చుటకు అవుసరమైతే భూమిని స్వాధీనము చేసుకొనుటకు అధికారము అవసరమైనది. దీనితోపాటు వ్యవసాయ పంటలకు రైతులక్షేమం దృష్ట్యా, న్యాయమైన ధరలు హామీ యిచ్చుటకూడ అవసరమైనది.

ఈ బిల్లువలన పై అధికారములు, సావకాశములు కల్పించబడినవి. అవసరమైనప్పుడు ప్రభుత్వము స్వాధీనమొనర్చుకున్న భూములనిర్వాహణకు వ్యవసాయ అభివృద్ధిసంఘములను ఏర్పరచుటకున్నూ, నిర్వహణ ఖర్చులకుగాను సంఘములకు ఆర్థికసహాయము చేయుటకున్నూ అవసరమగు అధికారములు ప్రభుత్వమునకు ఈబిల్లులో ఇవ్వబడినవి. ఈ సంఘములకు ధనసహాయము ఇచ్చుటకు, విత్తనములు, ఎరువులు, వ్యవసాయపరికరములు కొనుక్కొనుటకు ఋణములు ఇచ్చుటకు కూడ బిల్లులో ప్రభుత్వమునకు అధికారమివ్వబడినది.

### బిల్లు పాఠము

(1) ఈ యాక్టును 1949 వ సం॥పు మదరాసు వ్యవసాయపు అక్టు అని చెప్ప వచ్చును.

(2) అది మదరాసు రాష్ట్రమున కంతటికి వ్యాప్తినొందును.

2. ఈ అక్టున విషయమునకుగాని పూర్వోత్తర సందర్భమునకుగాని విరుద్ధముగా నేదైనా నుండినచో తప్ప—

(1) "స్వాధీనము" అనగా 1894 సం॥ లాండ్ ఎక్విజిషన్ యాక్టు క్రింద "స్వాధీనమొనర్చుకొనుట అని అర్థము.

(2) "వ్యవసాయము" లో ఉద్యానవన పరిశ్రమ, పశుపోషణమునుండ్రైట్లు చేరును.

(3) "వ్యవసాయపు భూమి" అగాన వ్యవసాయమున నుపయోగించు భూమి. లేదా వ్యవసాయమునకు లాయకీ అయిన భూమి (ఇందులో గయ్యాళి భూములు కూడ చేరును) ప్రవేటు ఇళ్ళకు చేరిన స్థలము (50 సెంట్లకు తక్కువ విస్తీర్ణము కానప్పుడు) అని అర్థము.

(4) "వ్యవసాయ సూపర్ వైజర్" అనగా ఈచట్టము క్రింద ఈ ఉద్యోగమునకు నిర్దేశించబడిన విధులను నిర్వహించుటకు నియమించబడు ఉద్యోగియని అర్థము.

(5) "గయ్యాళిభూమి" అనగా గ్రామ లెఖలలో గయ్యాళిభూమిగ నమోదు చేయబడిన భూమి అని అర్థము.

(6) "చర్యలు" లో అధికారములు విధులు చేరును.

(7) ప్రభుత్వ మనగా రాష్ట్ర ప్రభుత్వము.

(8) ప్రకటన అనగా ఫోర్టు సెంటు జార్జి గెజెటులో ప్రకటన అని అర్థము.

(9) "నిర్ణయింపబడిన" అనగా ఈ ఆక్టుక్రింద చేయబడినవిధులచే నిర్ణయింపబడిన అనిఅర్థము.

### ధరలహామీ, విక్రయ సౌకర్యములు

3. వ్యవసాయదారులలో షెడ్యూలులో ఉదహరించబడిన వస్తువులను వుత్పత్తి చేయుటకు ప్రోత్సహించుటకుగాను సమగ్రపరిశీలనానంతరం ప్రకటనలో ఉదహరించుధరలను వస్తువులకు హామీ ఒక సంవత్సరము తక్కువగాకుండా అమలులో వుండునట్లు ప్రభుత్వం నిర్ణయించుచు, వ్యవసాయవుత్పత్తికి విక్రయసౌకర్యములు కలుగ జేయును.

4. శక్షన్ 3 క్రింద జారీచేయు ప్రకటనలో ఉదహరించబడు కాలమున ప్రకటనలో నిర్ణయించబడిన ధరలను వుత్పత్తిదారులు పొందఅర్హులు. అధరలు ఆకాలములో తగ్గించబడవు.

5. శక్షన్ 3లో ఉదహరించబడిన హామీల నిర్వహణకుగాను ప్రభుత్వము—

(1) హామీ ఇవ్వబడిన ధరలకు వుత్పత్తినంతను ప్రభుత్వమే కొనవచ్చును, లేదా

(2) హామీ ఇవ్వబడిన ధరకు, ఇతర మరతులకులోబడి వుత్పత్తిని ఖరీదు చేయుటకు వ్యక్తికిగాని, వ్యక్తులకుగాని, కొందరి మందికి కలిపిగాని అధికార మివ్వవచ్చును.

(3) వుత్పత్తి దారులకు హామీ ఇవ్వబడిన ధరలకు విక్రయ సౌకర్యములు కలుగజేయుటకు అవసరమగు చర్యలు తీసుకొనును.

### యజమానుల విధులు

6. జాతిపుపయోగ దృష్ట్యా ప్రభుత్వము ఎప్పటికప్పుడు వుత్పత్తి చేయవలసిన వ్యవసాయ పదార్థములు, పంటల జాబితాను ప్రకటించు చుండును. అట్టి జాబితాలో ఉదహరించబడని పంటలను ఏభూమిలో గాని, భూములలోగాని, ఏ ప్రాంతములో గాని ప్రకటనద్వారా నిషేధించవచ్చును.

7. జాతికి ఆహారము, ఇతర వ్యవసాయపు పంటలను సప్లయి చేయుటకుగాను అవసరమని తోచినప్పుడు ప్రభుత్వము ఎప్పటికప్పుడు ఈ క్రిందిచర్యలు తీసుకొనుటకు మార్చుటకు, రద్దుచేయుటకు ఆర్డరుద్వారా ఏ ఉద్యోగికైనా అధికార మివ్వవచ్చును.

(1) వ్యవసాయంచేయక బంజరుగ యున్న భూమిని సాగుచేయవలెనని వుత్తర్వు చేయవచ్చును.

(2) ఏ భూమిలోనైనా ఏ పంటను ఎట్లు పండించవలెనో నిర్ణయించును.

(3) క్లా (2) లో తెల్పబట్టు సాగు క్రిందికి తీసుకొనివచ్చుటకు అవసరమగు పనుల నిర్వహించవలెనని సూచించ వచ్చును.

(4) ఫలానా ప్రాంతములో పశుగ్రాసముకొరకు గడ్డిని పెంచవలెనని వుత్తర్వు చేయవచ్చును.

(5) పరిశోధించని విత్తనములు నిషేధించవచ్చును.

(6) ఈచట్ట ఉద్దేశ్యముల నిర్వహణకు ఏవుత్తర్వునైనా చేయవచ్చును.

8. వ్యవసాయదారులు తమ విధులను సక్రమముగ నిర్వహించుచున్నదీ లేనిదీ పరిశీలించుటకు, ఏప్రాంతములోనైనా వ్యవసాయపనులను అజమాయిషీ చేయుటకున్నూ వ్యవసాయశాఖలోని ఏ ఉద్యోగినైనా వ్యవసాయ సూపర్వైజరుగ ప్రభుత్వం నియమించవచ్చును.

9. పంటలకు, పశువులకు, ఆహారధాన్యములకు, వృక్షములకు, చెర్వులకు నష్టము వాటిల్లకుండా ఏవ్యక్తికైననూ అవసరమగు చర్యలు తీసుకొనగోరుచు వ్రాతపూర్వకమైన నోటీసు ఇచ్చుటకు వ్యవసాయ సూపర్వైజర్లకు, అధికారమివ్వబడిన ఉద్యోగులకు, అధికార మివ్వబడినది.

10. యజమానులు, రైతులు హెచ్చుగ నాణ్యమైన పంట పండించుటకు అవసరమగు చర్యలు తీసుకొనును:—

(1) సాగుకు లాయకీ అయిన భూమిని సాగుచేయక వదల కూడదు.

(2) ఎరువులు వేసి భూమిని సారవంతంచేసి మంచిస్థితిలో వుంచవలెను.

(3) పంటలకు, పశువులకు పురుగు పట్టకుండుటకు అవసరమగు చర్యలు తీసుకొనవలెను.

(4) పంటలను సక్రమంగా కాచి సకాలములో మహసూల్ చేయవలెను.

(5) యజమానులు, రైతులు నిర్వహించవలసిన, మరమ్మతు చేయవలసిన పనులను సక్రమంగా నిర్వహించవలెను.

(6) నిర్ణయించబడినట్లు ఆహార పదార్థములను పండించుచు సరిగా పంట మార్పులు చేయవలెను.

(7) ఉద్యోగులు ఇచ్చు సూచనలను సక్రమముగ నిర్వహించవలెను.

11. (1) సూపర్వైజరు రిపోర్టుమీద ఏ భూమినయిననూ యజమాని సక్రమముగ నిర్వహించుటలేదని కలెక్టరు విశ్వసించిన యెడల యజమానికి నోటీసు ఇచ్చి ఏమైనా అభ్యంతరము లుంటే విని వారికి తోచినంతకాలము మేనేజిమెంటును మరొకరికి ఇవ్వవలెనని వుత్తర్వు చేయవచ్చును.

(2) భూమిని బాగుచేసి, వ్యవసాయం చేయుట మేనేజిమెంటు మార్పుకు ముఖ్య షరతుగ వుంచవలెను.

(3) ట్రాన్స్ఫర్ పొందినవారు కలెక్టరు నిర్ణయించు భాగము వుత్పత్తి నుండి చెల్లించవలెను.

(4) భూమి అభివృద్ధికైయిన ఖర్చులు యజమాని తరఫున లాండ్ రివిన్యూవలె ప్రభుత్వం వసూలుచేయవచ్చును.

12. (1) కవులుదారు తృప్తికరముగ వ్యవసాయము చేయుటలేదని కలెక్టరు నమ్మినయెడల కవులుదారుకునోటీసుఇచ్చి, ఆక్షేపణలున్నచో విని కవులును రద్దుచేసి స్వంతముగ వ్యవసాయము చేయవలెనని గాని, మరొక రైతుకు కవులు ఇవ్వవలెనని వుత్తర్వులు చేయవచ్చును. యజమాని ఈ పని చేయనియెడల కవులుదారు నామినేటు చేయవచ్చును.

(2) సబ్‌శక్షన్ (1) క్రింద కవులురద్దు చేయబడినప్పుడు రైతుకు మరమ్మతుల క్రింప ముదరాపొందు అర్హతలేదు.

(3) కలెక్టరుచే నియమించబడిన రైతు భూమిపైవచ్చు శిస్తును యజమానికి నేరుగ చెల్లించును.

13 (1) భూమి బంజరుగ, వ్యవసాయము చేయకుండా వదిలినయెడల కలెక్టరు యజమానికి నోటీసు ఇచ్చి సదరు భూమిని నిర్ణీతకాలములో సాయవలసిందిగ కోరవచ్చును. యజమాని చేయనియెడల కలెక్టరు నిర్ణయించు రైతుకు భూమి కవులుకు ఇవ్వబడును.

(2) నోటీసులో ఇచ్చిన వ్యవధిలోగ యజమాని చర్యతీసుకొనని యెడల భూమిని కలెక్టరుకు తోచినంత కాలము కవులుకు ఇవ్వవచ్చును. కవులు తీసుకొనిన వ్యక్తి ప్రభుత్వమునకు పన్ను కలెక్టరు నిర్ణయించిన శిస్తును యజమానికి ఇచ్చును.

(3) అట్టి రైతు తొలగించబడినప్పుడు అతను చేసిన అభివృద్ధి ఖర్చులు ముదరా పొంద అర్హుడు.

14. ఈ అధ్యాయముక్రింద జారిచేయబడిన వుత్తర్వుల అమలుకు అవసరమగు అధికారములను కలెక్టరు చలాయించవచ్చును

### సాగుచేయని భూముల స్వాధీనం

15. వ్యవసాయపు భూమి సాగు చేయకుండాను, సరిగా సాగు చేయకుండాను వదలి వేయబడినప్పుడు నిర్బంధంగా కొనుట వలన గాని కవులుకు తీసుకొనుట ద్వారాగాని ప్రభుత్వం స్వాధీనము చేసుకొనవచ్చును. సక్రమముగ వ్యవసాయము చేయించుటకు చర్యలు తీసుకొనవచ్చును.

16. అట్లు స్వాధీన మొనర్చుకొనబడిన భూమి అతిరాపు భూములు లేనిదే తృప్తికరముగ వ్యవసాయము చేయ వీలులేనిచో ప్రభుత్వము అట్టి అతిరాపు భూములను కూడ నిర్బంధించి స్వాధీన మొనర్చుకొనవచ్చును.

### గయ్యాళీ భూముల సాగు

17. (1) ప్రభుత్వము వుత్తర్వు ద్వారా 49 యకరములకు మించి నూరు యకరములలోపు ఆక్రమించిన భూమిలో వ్యవసాయక సంవత్సరములో క్రితం సంవత్సరము సాగు చేసిన ఏరియాకి తోడుగ 10% గయ్యాళి భూమిని సాగుచేయవలెను.

(2) నూరు ఎకరములకు మించి భూమి ఆక్రమణలో వున్నవారు స్వయంగగాని, కవులుకు ఇచ్చిగాని క్రితం సం॥ము సాగు చేసిన భూమికితోడుగ 20% గయ్యాళీ భూమిని సాగుచేయవలెను.

(3) సబ్ శక్షన్ (1) (2) క్రింద సాగు చేయవలసిన గయ్యాళీ భూమిని స్తీర్ణ నిర్ణయములో అరఎకరముల తక్కువలు పరిగణించబడవు.

18 (1) ఏ యజమానిగాని వ్యవసాయక సంవత్సరములో ఏప్రియల్ 1 కి పూర్వము శక్షన్ (17) నుండి మినహాయింపుగోరుచు సూపర్ వైజర్‌కు దరఖాస్తు చేసుకొనవచ్చును.

(2) దరఖాస్తు చేరినమీదట సూపర్ వైజరు అవసరమని తలచిన విచారణ చేసుకొని శక్షన్ 17 సబ్ శక్షన్ (1) (2) క్రింద గయ్యాళిభూమి సాగు విస్తీర్ణము సందర్భమున మినహాయింపు సర్టిఫికేటు మంజూరుచేయును.

(3) మినహాయింపు ఇచ్చుటకు తగిన కారణములు లేనప్పుడు ఏప్రియల్ 1 లోగ యజమాని శక్షన్ 17 క్రింద సాగు చేయవలసిన భూమి వ్యవసాయముచేయుటకు కవులుదారుని ఎర్పాటు చేయవలసినదిగ కోరినప్పుడు 5 సం. ములకు మించకుండా కలెక్టరు కవులుకు ఇవ్వవచ్చును.

(4) సబ్‌శక్షన్ (3) క్రింద ఇవ్వబడు కవుళ్ళకు యజమానితరఫున కలెక్టరుగాని తహశీల్దార్‌కి తక్కువగాని ఉద్యోగిగాని వ్రాసిఇచ్చును.

### వ్యవసాయాభివృద్ధి బోర్డులు

19. ఏప్రాంతములోనయినా యీ చట్టంలో సూచించిన పనులు నిర్వహించుటకు వ్యవసాయాభివృద్ధి బోర్డులను ప్రభుత్వంవారు నియమించగలరు.

20. అందు వ్యవసాయమునందు తెలిసినవారిని అవసరమయినంతమందిని, కాల నిర్ణయంతో సభ్యులుగ నియమింతురు.

21. సదరు బోర్డు యీ చట్టంలో ఉద్దేశింపబడిన పనులు నిర్వహించుటకు ప్రభుత్వంవారి ఏజెంటుగ పనిచేయును.

22. ఆబోర్డునకు ప్రభుత్వంవారు భుక్త పరచుకొన్న భూములను ఒప్పగించును. వ్యవసాయమునకు డబ్బు యివ్వగలరు.

23. బోర్డువారికి ఒప్పగించబడిన భూములను వారు యితరులకు కౌలుయిచ్చి సాగు చేయించవచ్చు, భూస్వామి అశ్రద్ధ వల్లగాని, స్థానికంగా లేకుండుట వల్ల గాని సాగు జరుగకున్నచో సాగు చేయించవచ్చు, విద్యుచ్ఛక్తి మున్నగు అభివృద్ధికరమగు సాధనలు ఉపయోగించవచ్చు, అవసరమగు మరమ్మత్తులన్ని చేయవచ్చును.

24. 100 ఎకరాలకు తక్కువ కాని పొలము బోర్డువారికి పరం చేయబడినపుడు అభివృద్ధి స్కీములు తయారుచేసి ప్రభుత్వంవారికి పంపవచ్చును.

25. ప్రభుత్వంవా రాస్కీములకు కొద్ది మార్పులతోగాని మార్పులు లేకుండాగాని మంజూరు చేసినపిమ్మట బోర్డువారు అమలు జరపాలి.

26. బోర్డువారు వసూలుచేసిన కట్టుబడులన్నీ ప్రభుత్వానికి పంపాలి.

27. బోర్డువారు తమ కొప్పగించిన భూములన్నింటికి అవసరమగు రికార్డులు మ్యాపులు జాబితాలు ఉంచాలి.

28. బోర్డువారు కౌలుకిచ్చే వ్యక్తులు వ్యవసాయానుభవంగల సమర్థులుగా ఉండాలి. లేదా సహకార సంఘముల కివ్వవచ్చు. వ్యవసాయ కార్మికులుగా నున్నవారికి యివ్వవచ్చు.

29. ఎకరాల పల్లం 10 ఎకరాల మెరక, లేక 2 ఏకరాల టకు తక్కువ కాని మేరకే బోర్డువారు ఎవరికైనా కౌలికివ్వాలి.

30 బోర్డు సభ్యులకు జీతాలు, ప్రయాణపు ఖర్చులు యివ్వబడును. బోర్డు నియమించే ఉద్యోగులకు జీతాల ఖర్చు ప్రభుత్వంవారు మంజూరుచేయాలి.

### శిక్షలు

31. ఈచట్టం ప్రకారం ప్రభుత్వం వారి ఉద్యోగులు యిచ్చే ఉత్తర్వులను ... ఉల్లంఘించిన వారికి రు 100/- వరకు జరిమానా విధించబడును. 17 వ శెక్షన్ లో 1 లేక 2 సబు శెక్షనుల ప్రకారం అందిన ఉత్తర్వులను ఉల్లంఘించి బంజరులను సాగుచేయని భూస్వామునకు, ఎకరానికి రు 50/- చొ॥ జరిమానా యిచ్చుకోవలసి యుండును.

32. పై క్లాజులో చెప్పిన జరిమానా తో జోక్యంలేకుండానే, ఆశెక్షను ప్రకారం రివెన్యూ ఉద్యోగి ఉత్తర్వు చేసినచో అతని దిగువ ఉద్యోగు లెవరైనను ఆ భూములలోనికిపోయి, అధికారులు చెప్పిన రీతి మరమ్మతులుచేయించవచ్చును. అందుకగు ఖర్చులు భూస్వామినద్ద భూమి శిస్తు బాకీలు వసూలు చేయునట్లు వసూలుచేయబడును.

33. అట్లు మరమ్మతుపని చేయించుచున్న ఉద్యోగులను నిరోధించువారు రూ. 100/- జరిమానాకు గురియగుదురు.

34. ప్రభుత్వంవారు తమ వశమునందున్న పొలములను తమకు తోచినవారికి ఇష్టంవచ్చిన.షరతులపైకౌలు ఇచ్చుటకు యీ చట్టంలో ఏ నియమము అడ్డురాదు.

### ఋణములు

35—బోర్డులకును, భూస్వాములకును విత్తనాలకు, ఎరువులకు ట్రాక్టరులకు మున్నగు వాటికి ప్రభుత్వంవారు ఋణములు యివ్వవచ్చును.

36:—ఈ చట్టంక్రింద చేరిన భూములలో పండే పంటలపై ప్రభుత్వంవారు సెస్సు విధించవచ్చును.

37:—ఈ చట్టం ప్రకారం తీసుకొన్న చర్యపై సివిల్ కోర్టులలో ఫిర్యాదు చేయుటకు అధికారం ఉండదు.

38:—ఈ చట్టం అమలు జరుపుటకు ప్రభుత్వంవారు రూల్సు తయారు చేయుదురు.

39:—జిల్లా కలెక్టరుకి యీ చట్టం ప్రకారంగల అధికారాలు తాశీల్దారు హోదాకు మించిన ఉద్యోగులకు ఒప్పగించవచ్చును.

## బహిరంగసభ

"ఆంధ్రరాష్ట్రం - చెన్నపురి" గూర్చి బహిరంగసభ 22 తే. సా. 6 గం. చెన్నపురి ఆంధ్రమహాసభయందు(వి. పి. హాల్) శ్రీ బులుసు సాంబమూర్తిగారి అధ్యక్షతను జరుగును. శ్రీ సామి వెంకటాచలం చెట్టి, బచ్చు పాపయ్య చెట్టి, మన్నె వెంకట్రామయ్యగారు (రిటైర్డు జడ్జి) మున్నగువారు ఉపన్యసింతురు.

కొసరిహద్దు సం॥
ఆంధ్ర సరిహద్దు సం॥
సమావేశము 89.
పూరునందు జరుగు

## ఇండో-పాక్ సంబంధాలు

### ఒక్క విషయంలో మాత్రమే పొరపొచ్చెం వున్నదని శ్రీ మీనన్

న్యూఢిల్లీ, జులై 19: పాక్స్థాన్, ఇండియాకు అన్నివిషయాల్లోను సామరస్యం ఏర్పడివున్నా ఒక్క విషయంలో మాత్రం ఇంకా అభిప్రాయభేదాలు అట్లాగే వున్నాయని నేడు భారత విదేశాంగశాఖ కార్యదర్శి శ్రీ కె. పి. ఎస్. మీనన్ వెల్లడించారు.

ఆ విషయం ఏమిటో తాను ఇప్పుడు చెప్పనని, అయినా అంగులో మొదటి అక్షరంమాత్రం అందిస్తానని అంటూ అది "గో"...అని తెలియజేసారు.

## ప. బెంగాల్ వ్యవహారాలు

### కాంగ్రెస్ సంఘానికి వెంకట్రావుగారి లేఖ

కలకత్తా, జులై 20: జులై 27 వ తేదీన జరిగే కాంగ్రెస్ కార్యవర్గ సమావేశానికి, యిద్దరు ముగ్గురు ప్రతినిధులను పంపవలసినదిగా, అఖిలభారతి కాంగ్రెస్ సంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ కళా వెంకటరావుగారు, పశ్చిమబెంగాల్ రాష్ట్ర కాంగ్రెసుకు లేఖ పంపారు.

## చెన్నరాష్ట్రములో నిల్వలు

చెన్నపట్నం, జూలై 21: చెన్నరాష్ట్రంలో బట్టల నిల్వలు హెచ్చుగా లేవని నేడు దేశవాళీ మిల్లుల కార్యదర్శి శ్రీ యం. టి. రాజుగారు పత్రికా ప్రతినిధులతో చెప్పారు.

నూలుబట్టల పంపకం స్వేచ్ఛగా సాగటానికి ఎంతవుంటే పట్టికి అంతవుంటేకి ... ఉత్తర్వులు జారీచేసినని శ్రీ రాజుగారు తెలిపిరి.

# గుం. జి. కాంగ్రెస్ కార్యవర్గ చర్యల యెడ అభిశంసనం

## కొంతమంది కాంగ్రెస్ కార్యకర్తల సమావేశ తీర్మానాలు

గుంటూరు, జూలై, 16: ఒంగోలు, బాపట్ల, తెనాలి, నరసరావుపేట, గుంటూరు, సత్తెనపల్లి, తాలూకా కాంగ్రెస్ సంఘాల అధ్యక్ష కార్యదర్శులు, కొంతమంది కార్యవర్గసభ్యులు, కొన్ని పట్టణ సంఘాల కార్యకర్తలు, జిల్లా, తాలూకా కాంగ్రెసు సంఘాల సభ్యులు, గ్రామ కాంగ్రెసుసంఘాల కార్యకర్తలు మొత్తం 200మంది నిన్న నిచ్చట ఇనుగులపాటి గోవిందరావుగారి ఇంట్లో సమావేశమైనారు. గోగినేని లక్ష్మీనారాయణ, నల్లూరి రాజయ్య, చింతమనేని భావయ్య, నడింపల్లి నరసింహారావు, తమ్మా శేషిరెడ్డి, గోగినేని వెంకటసుబ్బయ్య, బాచిన సుబ్బారావు మొదలైనవారు చర్చలలో పాల్గొన్నారు. సభకు శరణు రామస్వామి నాదరిగారు అధ్యక్షత వహించారు.

ప్రస్తుత గుంటూరు జిల్లా కాంగ్రెసు కార్యవర్గ విధానము అవిధేయకరమ దారి తీయుచున్నదనియు, రాష్ట్ర కాంగ్రెసు సంఘ ఆదేశమును అమలు జరుపకపోవుట కాంగ్రెసు సంస్థలో అరాచకము కలిగించె ననియు, వారి బాధ్యతారహిత చర్యల వలన జిల్లాలో యేర్పడిన పరిస్థితులను గురించి శాంతముగా చర్చించి పరిష్కార మార్గమును చూపవలసియున్నదని అధ్యక్షుడు ఉపన్యసించెను.

జిల్లా కాంగ్రెస్ సర్వసభ్య సమావేశము జరిపి యీ అంశములు చర్చించుటకు అవకాశము కల్గించినయెడల యీ సమావేశము అవసరము వుండేది గాదనియు, జిల్లా కాంగ్రెసు కార్యవర్గం అది జరుపక బాధ్యతారహితంగాను, నిరంకుశంగాను, వ్యవహరించినందున నీ యీ సమావేశము జరుపుట తప్పనిసరిఅయినదని సమావేశ కర్తలు నుడివిరి.

మంత్రివర్గము, మంత్రివర్గపక్షీయులైన యం. యల్. ఏ. ల యొక్క అధికార దుర్వినియోగమువిూద తీర్మానము చర్చకు వచ్చినప్పుడు చాలామంది సభ్యులు తమ ప్రాంతాలలో మంత్రివర్గ పక్షమువారు చేసిన అక్రమాలు ఉదహరించి కాంగ్రెసు హైకమాండువారు యీ మంత్రివర్గమును వెంటనే మార్పుచేయనిది శాంతి వుండ బోదని నుడివిరి.

### తీర్మానములు

సమావేశములో ఈ దిగువ తీర్మానములు చేయబడినవి: యిప్పటి కాంగ్రెసు ప్రభుత్వ పరిపాలనయెడల ప్రజలు అసంతృప్తి చెందియున్నప్పటికి జిల్లాబోర్డు యెన్నికలలో కాంగ్రెసుతరఫున అభ్యర్థులు పాల్గొనకపోతే కాంగ్రెసు వ్యతిరేక శక్తులు తమతమ పార్టీలబలముకుగాను జిల్లా బోర్డును వుపయోగించుకొని ప్రజలలో కాంగ్రెసు పలుకుబడిని మరింత సన్నగిల్లునట్టు చేయ సంకల్పించుచున్న యీ క్లిష్ట సమయములో జిల్లాబోర్డు యెన్నికలలో కాంగ్రెసు పాల్గొనబో వుచున్న దన్న రాష్ట్ర కాంగ్రెసు నిర్ణయానికి యీ సభవారు తమ సమ్మతిని తెల్పుచున్నారు.

జూన్ 6 వ గురజాలలో సమావేశం జరిపి కార్యవర్గమువారు జిల్లాబోర్డు ఎన్నికలలో కాంగ్రెసు తరఫున యీ జిల్లాలో అభ్యర్థులను పెట్టవలదని రాష్ట్రకాంగ్రెసు సంఘాన్ని కోరుతూ తీర్మానించడం యీ జిల్లాలోని కాంగ్రెసు సేవకుల, ప్రజల అభిప్రాయానికి వ్యతిరేకమని ప్రకటిస్తూ, కనీసం జిల్లా కాంగ్రెసు సర్వసభ్యుల అభిప్రాయాన్ని అయినా తీసుకొనకయే అటు రాష్ట్ర కాంగ్రెసు సంఘ ఆదేశానికి యిటు ప్రజలు, కాంగ్రెసుసేవకుల అభిప్రాయానికి భిన్నంగా ప్రవర్తించుచున్న జిల్లా కాంగ్రెసు కార్యవర్గ బాధ్యతారహితచర్యను యీ సభవారు తీవ్రంగా గర్హించుచున్నారు.

జిల్లాబోర్డు ఎన్నికలకు కాంగ్రెసుఅభ్యర్థుల నిర్ణయించుట, కమ్యూనిస్టు దౌర్జన్య చర్యలు అరికట్టుటకు అవసర చర్యలు తీసుకొనుట, ధాన్యం సేకరణపట్ల ప్రజల వ్యతిరేకతను గురించి చర్చించు నిమిత్తం యీ జిల్లా కాంగ్రెసు జనరల్ బాడీ మీటింగును జరుపుటకుగాను జిల్లా కాంగ్రెసు కార్యవర్గానికి రిక్విజిషన్ నోటీసు యివ్వవలసిందిగా యీ సభవారు జిల్లా కాంగ్రెసు సభ్యులను కోరుచున్నారు.

శ్రీ మంతెన వెంకటరాజుగారి మీద క్రమశిక్షణ చర్య సందర్భంలో ప్రస్తుత రాష్ట్రపతిగారి పాక్షిక నిర్ణయమును గురించి కాంగ్రెసు కార్యవర్గమువారు ఆలోచించి కాంగ్రెసు ప్రతిష్ఠను నిలపవలసిందిగా ఈ సభవారు కోరుచున్నారు.

ప్రస్తుత మద్రాసు మంత్రివర్గములోని కొందరు మంత్రులు, వారి అనుచరులైన ఎం. ఎల్. ఏ. లు ప్రవర్తనను విమర్శిస్తూ వారిపై మోపబడిన ఆరోపణలను ట్రిబ్యునలుద్వారా న్యాయవిచారణ జరిపించి, ప్రజల అనుమానాలు తీర్చి, కాంగ్రెసు ప్రభుత్వ వ్యవహారాలను చక్కదిద్ది కాంగ్రెసు ప్రతిష్ఠను యినుమడింప జేయవలసినదిగా యీ సభవారు అఖిలభారత కాంగ్రెసు కార్యవర్గమువారిని కోరుచున్నారు.

ప్రభుత్వం రహస్యంగా దాక్కొనుచున్న నాలుగుమంది కమ్యూనిస్టులను పట్టుకొనలేక పోవుటయు, కమ్యూనిస్టు దౌర్జన్య చర్యలకు బలియైన సుమారు 200 మంది ఆంధ్రకాంగ్రెసు ప్రముఖులను రక్షింపలేక పోవడమునకు యీ సభవారు తమ అసమ్మతిని ప్రకటిస్తూ, కాంగ్రెసు ప్రముఖుల, కాంగ్రెసు సేవాదళముల సహకారముతో పల్లెల్లో శాంతిరక్షణదళాలు యేర్పాటుచేసి కమ్యూనిస్టు ప్రమాదాన్ని అరికట్టవలసిందిగా ప్రభుత్వాన్ని యీ సభవారు కోరుచున్నారు.

ఈ జిల్లాలో తిరిగి రేషను ప్రవేశపెట్టుటకు ప్రభుత్వం సన్నాహాలు జరుపుటను నిరసిస్తూ రేషను పెట్టవలదని ప్రభుత్వాన్ని ప్రజలతరఫున కోరుచున్నారు.

# మచిలీపట్నంలో ధాన్యం నిల్వల కొరత

## అధికారులకు మిల్లుల సంఘంవారి సూచనలు

మచిలీపట్నం, జూలై 19: ఈ ఏడాది మొదటి 6 నెలలఅనంతరం ఈపట్నంలోని మిల్లులలో ఉండవలసిన ధాన్యం,బియ్యం కనీసం ఉండవలసిన పరిమితికన్నా తక్కువయనీ, పేటలోనుంచి ఇంకొకరవాణా కావలసివి పోతే మిగిలేవి ఈపట్నవాసులకు 2 నెలలకు మాత్రమే సరిపోతేవనీ, డిసెంబరులో కొత్త ధాన్యం వచ్చేవరకూ స్థానిక అవసరాలు తీర్చాలంటే కనీసం మరి 3 వేల టన్నులైనా అవుసరం కనుక ధాన్య సేకరణ అధికంచేయుటో, లేదా రవాణాలు తగ్గించుటో చేయవలెననీ స్థానిక రైసు మిల్లుల సంఘమువారు జూన్ 30 తో అంతమయ్యే అర్థసంవత్సరానంతర స్థానిక ధాన్యనిల్వల స్థితిని సమీక్షిస్తూ, రాష్ట్ర సివిల్ సప్లయిల కమీషనరుకూ, జిల్లాకలెక్టరుకూ, జిల్లా సప్లయి ఆఫీసరుకూ నివేదిక పంపిరి.

నివేదికలో ఈదిగువ వివరాలున్నవి: జూన్ 30 వ 1,39,358 మణుగుల ధాన్యమున్నూ, 13,945 మణుగుల బియ్యమును, అన్నీ చేర్చి 1,11,495 మణుగుల బియ్యముగలదు. ఈ నిల్వలోనుండి ప్రస్తుతము 58,960 మణుగులు రవాణాచేయాలి. మిగతా 57,535 మణుగులు ఈ పట్టణవాసులకు 8 వారాలువచ్చును.నిల్వయుండవలసినదరకు కనీసముకన్నా తగ్గుటచే ధాన్య సేకరణకు తీవ్రకృషి చేయవలసియున్నది. ఈ ధాన్యసేకరణ బందరు, దివి తాలూకాల్లోని పెద్ద రైతుల వద్ద యున్న ధాన్య పు నిల్వలనుండి రాబట్టాలి. అయితే ధాన్య సేకరణ విధానమునకు ఎంతవరకు సహకారముండునో చెప్పలేము కనుక ఈ పట్టణం నుంచి రవాణా తగ్గించవలెనని యున్నది. జూన్ 10 న జరిగిన జిల్లా ఆహార సంఘ సభలో అప్పటి నిల్వనుబట్టి ఎంతవరకు రవాణాలు చేయాలో పరిశీలించవలసిన ఆవశ్యకతను జిల్లా కలెక్టరుగారికి మనవి చేయడమైనది. అధికారులు యదార్థ స్థితిని గమనించెదరని ఆశిస్తున్నాము. ప్రస్తుతము అమలు జరపాల్సిన పర్మిట్ల ప్రకారం మాత్ర మే బియ్యమురవాణా చేస్తేచె వ్వ డిశంబరు మాసములో కొత్త ధాన్యం వచ్చేలోగా 3000 టన్నులు సమకూడ గలవని నమ్ముతున్నాము. కావున మిల్లులవద్ద 3000 టన్నుల ధాన్యం నిల్వవుంచేటట్లు చేస్తే పట్టణావసరముల విషయములోగల ఆదుర్దాలేకుండా పోతుంది. ధాన్యసేకరణ విషయంలో ధాన్యం నిల్వలుగల రైతులు ఎంతవరకు ధాన్యమును అధికారులకు స్వాధీనముచేయుటానికి సహకారము చూపుదురో తెలియని విషయం కాదు. పట్టణాలలో యున్న మిల్లులకు రైతుధాన్యం తీసుకొని వచ్చేందుకు అయ్యే కిరాయిచూస్తే రైతుకు నిరాశాభావము కలుగును. కాని గ్రామంలోనే యున్న మిల్లులు బంప్లకి రాయి మిన హాయించబడానే సీలింగుధర నివ్వ గలవు. కావున గ్రామాల్లోవున్న మిల్లులవద్ద నిల్వ సరుకులను వెంటనే లెక్కతీసి, ఆ మిల్లులు ఎంతవరకు కొనుగోలు చేయవచ్చునో అధికారులు నిర్ణయించవలెను.

ఈ అంశములను అధికారులకు మనవి చేయుటకు మిల్లు సంఘమువారు త్వరలో రాయబారమంపెదరని తెలియుచున్నది.

# తిరుపతి ప్రాచ్యకళాశాల హరిజన విద్యార్థులు

## విద్యార్థి వేతనాలకు అర్హులు కారని వెల్ఫేర్ ఆఫీసరు ప్రకటన

తిరుపతి, జూలై 20: శ్రీ వెంకటేశ్వర ప్రాచ్య కళాశాలలోని హరిజన విద్యార్థులు విద్యార్థి వేతనాలకు అర్హులుకారనీ, ప్రభుత్వం ఉత్తరువు చేస్తేనే విద్యార్థి వేతనాలు ఇవ్వడమగునని ప్రభుత్వ హరిజన వెల్ఫేర్ ఆఫీసరు ప్రకటించెను.

### కోడలిపై అఘాయిత్యం జరిపిన అత్తపై కేసు

నరసింగాపురంలో, కోడలిపై కిరసనాయిలు పోసి నిప్పంటించిన జీపాలం బోడెక్కపై పెట్టబడిన కేసును స్థానిక మేజస్ట్రీటు విచారించి, సెషన్సుకమిట్ చేసిరి. (స్వ. వి.)

# రేషనింగుకు ప్రాతికూల్యం

## చీరాల పట్టణకాంగ్రెసు తీర్మానం

చీరాల, జులై 19: ఇచ్చట బియ్యం బాగా దొరకుచున్నందునను, చుట్టుపట్ల వరిపైరు పండు ప్రదేశము గనకను, చీరాల పరిసర ప్రాంతములలో రేషనింగుకు అవసరములేదు. పైగాదు మిక్కిలి రేషనింగ ప్రజలకు ముఖ్యముగా బీదలకు యిబ్బంది. గనుక రేషనింగు అమలు విరమించవలసినదని ప్రభుత్వమును కోరుచూ ఈ పట్టణ కాంగ్రెస్ సంఘం మొన్న పచ్చిపులుసు సుబ్రహ్మణ్యం శ్రేష్టిగారి అధ్యక్షతను సమావేశమై తీర్మానించెను. తీర్మానము ప్రతులు ప్రభుత్వమునకు, జిల్లాకలెక్టరు, జిల్లాకాంగ్రెసు సంఘమునకు పంపిరి.

### జాంగ్రపేట

జాంగ్రపేట చేనేత కాంగ్రెసు సంఘమువారు పంచాయతీబోర్డు అధ్యక్షుడు జండారు శివప్రసాద్ గారి అధ్యక్షతను సమావేశమై జాంగ్రపేట కుగ్రామ మనియు అక్కడివారు చాలా బీదకార్మికులనియు జాంగ్రపేటలో రేషనింగు అవసరములేదనియు, గాన ఆ గ్రామమును చీరాల మునిసిపాల్టీ రేషనింగు పరిహద్దు నుండి తొలగించమని ప్రభుత్వమువారిని కోరుచూ ఒక తీర్మానముచేసిరి. తీర్మానము ప్రతులు ప్రభుత్వమునకు, జిల్లా అధికారులకు పంపిరని తెలిసినది.

స్థానిక వర్తకకారచయితలు నిన్న ఆర్. డి. నాథంగారి అధ్యక్షతను సమావేశమై ఇచ్చట రేషనింగు పెట్టవలదని తీర్మానించిరి.

# స్థానిక విద్యాసంస్థలు: పురపాలక సంఘ స్వాధీనం

ఇచ్చటి యస్. ఆర్. పి. బోర్డు హైస్కూలు, హనుమాయమ్మ గరల్సు రెసిడెన్షియల్ హైస్కూలు వాటి ఆస్తిపాస్తులతో ఈ సంవత్సరమునుండియే గుంటూరు జిల్లాబోర్డు పరిపాలననుండి ఈ పురపాలక సంఘ యాజమాన్యమునకు మార్చుచూ నేడు మునిసిపల్ కమీషనరు గారికి ప్రభుత్వం వారివద్దనుండి ఉత్తరువులు వచ్చినవి. అగస్టు 1-న ఒప్పగింతలు జరుగునని అనుకొనుచున్నారు. ఎలిమెంటరీ స్కూళ్లు, ట్రావెలర్సు బంగళా గూడ జిల్లాబోర్డు పరిపాలననుండి మునిసిపాలిటీకి మార్పు చేయుమా ప్రభుత్వంవారు యిటీవలనే ఉత్తరువులు పంపినట్లు తెలియుచున్నది.

### 23 మంది జూదరుల అరెస్టు

చీరాలలో రోడ్ మార్జినులో పేకాట ఆడుచున్న 23 మందిని నిన్న పోలీసువారు అరెస్టుచేసి జామీనుమీద విడుదల చేసిరి. వారివద్ద జూద పు వస్తువులు, రు 13/-ల చిల్లర స్వాధీనము చేసుకొనిరి.

# కాంగ్రెసు సేవాదళంవారిపై ఆరోపణ

మచిలీపట్నం, జులై 19: దివితాలూకా అనుదాలలంక గ్రామస్థులు పరుచూరి అప్పయ్య వగైరాల తరఫున యలమంచిలి నాగభూషణంగారు కృష్ణాజిల్లా కలక్టరు గారికి ఒక పిటీషన్ దాఖలు చేశారు. అనుదాలలంకలోని కాంగ్రెసు సేవాదళము వారి ప్రోద్బలముతో పోలీసువారు ఆ గ్రామములోని మండవ బసవయ్య వగైరాలను అరెస్టుచేసి, కొట్టి, వెలువోలు గ్రామమునకు తీసుకొనిపోయి హింసించారని ఆ పిటీషన్‌లో తెలిపినట్లు తెలిసినది. కలెక్టరుగారు ఆ పిటీషన్‌ను స్థానిక సబ్‌డివిజనల్ మేజస్ట్రేటు కె. పి. కామయ్యలుగారికి పంపిరి. కామయ్యలుగారు ఈ నెల 13 న అనుదాలలంకలో విచారణచేశారు. విచారణ పర్యవసానము కలక్టరుగారికి త్వరలో అందజేస్తారని తెలియుచున్నది.

### ద్వీపాంతరవాస శిక్ష

మునగాలపల్లి గ్రామస్థుడు గోరంట్ల సావుల్యాలు అను 20 ఏండ్ల వ్యక్తికి, అతడు తన భార్యా ఎలిజబెతమ్మ నడవడిని శంకించి ఆమెను చంపాడనే నేరమునకు కృష్ణాజిల్లా సెషన్సుజడ్జీ జనాబ్ సయ్యద్ ఇమాముద్దీన్‌గారు, ఐ. పి. సి. 302 సెక్షన్ క్రింద, ద్వీపాంతరవాస శిక్ష విధించారు. (స్వ. వి.)

### పరారీలోఉన్న చెంచుల అరెస్టు

మార్కాపురం, జూలై 14: స్థానిక స్టేషనరీ సబ్‌మేజస్ట్రేటు టి. శేషాచల శాస్త్రిగారు, ప్రొహిబిషన్‌గార్డుగానుండిన యస్. మహమ్మద్ హనీఫ్ అనువరికి, ఈ వ్రాసికి దొంగతనముగ నాటు సారాయి తెచ్చుచున్న నేరమునకు 4 నెలలు కఠిన శిక్ష విధించిరి.

స్థానిక పోలీసు సర్కిల్ యిన్‌స్పెక్టరు యస్. అబ్దుల్ ఖుద్దూసు సాహెబు, దోర్నాల పోలీసు సబ్‌ఇన్‌స్పెక్టరు సయ్యద్ హుసేన్‌తో చింతలముడిపి అడవిలో సోదాలు జరిపి, సుమారు 2 సంవత్సరములనుండి అడవులలోకి తప్పించుకతిరుగుచున్న అనుసుయ చెంచువారిని పట్టుకొనిరి. ఈ అనుసుకిలో యిద్దరిపై ఖూనీకేసు, మిగతా నలుగురిపై బందిపోటు కేసులు ఉన్నవి. వీరివద్ద లైసెన్సులేని ఒక నాటు పిస్తోలుకూడా పట్టుకొనిరి. (స్వ. వి.)

# జాతీయ భాష లిపి విషయమై త్వరలో నిర్ణయము

## ఆచార్య భావే ప్రభృతుల సమష్టి ప్రకటన

వార్ధా, జులై 20: జాతీయ భాష, లిపి విషయమై వాదోప వాదములను అంతముచేసి, ఈ సమస్యను పరస్పర సుహృద్భావమునను, విశాలదృష్టితోను పరిష్కరింపవలెనని భారతీయులను కోరుచు కాకా కలేల్కరు, ఆచార్య వినోబా భావే, కే. జి. మష్రూవాలాగారలు సమష్టిగా ప్రకటన గావించుచున్నారు. భారతదేశ రాజభాషను గూర్చి, లిపిని గూర్చి వీరు కొన్ని సూచనలు గావించుచున్నారు.

పూర్తికావచ్చుచున్న భారత రాజ్యాంగ విధానము మతముతో సంబంధములేని ప్రజాసత్తాకము నేర్పరుచుచున్నదని, భారతదేశములో నివసించు అన్ని మతముల, అన్నివర్గముల విజ్ఞానమును రక్షించుచున్నదని ప్రప్రథమమున వీరు చెప్పుచున్నారు. రాజ్యాంగపరిషత్తువారు అనేక క్లిష్ట సమస్యలను పరస్పర సుహృద్భావమున పరిష్కరించిరని వీరు చెప్పుచు మిగిలియున్న సమస్యలలో ముఖ్యమైన జాతీయభాష, లిపి సమస్యను యిట్టి సుహృద్భావములనే పరిష్కరింపవలసియున్నదనుచున్నారు. వారు గావించు ఈ క్రింది సూచనలను అందరు అంగీకరించవలెనని ప్రార్థించుచున్నారు.

(1) భారతదేశమంతటికి ఒక సమాన్య భాష యుండవలెను. దేశ ప్రజలందరు తమ ప్రాంతీయభాష యేదైనను సామాన్య భాషను పఠించవలెను. ఈ భాష ఆంగ్లము కొజాలదు. శాసనములను ఈ భాషలో రచింపవలెను. ఈ భాషలో రచింపబడిన శాసనమే ప్రామాణికమైనదిగా ఎంచబడవలెను.

(2) కేంద్రప్రభుత్వమువారు ఈ భాషను హిందుస్థానీయని పిలువవలెను. ప్రజలు దానిని హిందీయనిగాని, హిందూస్థానీయనిగాని పిలువవచ్చును. ప్రజ లిట్లు పిలుచుటకు యెవ్వరూ ఆక్షేపింపరాదు.

(3) ఈ భాష ఢిల్లీలోను, తత్పరిసరములలోను మాట్లాడుభాషగా నుండవలెను. సులభమైనదిగా నుండవలెను. సంస్కృత, పర్షియన్, అరబిక్ పదాడంబర ముండరాదు. విదేశీయ పదములను, ముఖ్యముగా దేశీయభాషలోనికి వచ్చిన విదేశీయ పదములను బహిష్కరించరాదు. అన్ని భాషలలోని పదములన్నను స్వీకరించవలెను. క్రొత్తగా సృష్టించవలసిన పదముల మూలము సంస్కృతభాషగా నుండవలెను ఈ పదములు సులభమైనవిగాను, వాడుక భాషలో యిమిడినవిగాను, అందరు ప్రేమించదగినవిగాను వుండవలెను. భాషను సహజముగా వృద్ధికానివ్వవలెను. హద్దులేమియు పెట్టరాదు.

(4) కేంద్ర ప్రభుత్వ వ్యవహారముల లోను, అంతర్రాష్ట్రీయ ఉత్తర ప్రత్యుత్తరములలోను నాగరి లిపిని ఉపయోగించవలెను, ప్రభుత్వోద్యోగులందరు ఈ లిపిని నేర్చుకొనవలెను. ఐనప్పటికి ప్రజలు ఉర్దూభాషలో పెట్టుకొను దరఖాస్తులను, విజ్ఞప్తులను క్రమమైనవిగా ఎంచవలెను. ప్రభుత్వ ప్రకటనలను, పత్రములను, ప్రొక్లమేషన్లను నాగరి ఉర్దూ లిపులు రెంటిలోను ప్రకటించవలెను.

ఈ సూచనలను ప్రజాప్రతినిధి పరిషత్తువారును ప్రజలును ఆమోదింపవలెనని కాకా కలేల్కరు మున్నగువారు ప్రార్థించుచున్నారు.

# జైలునుంచి పారిపోయిన కమ్యూనిస్టు అరెస్టు

రాజమహేంద్రవరం, జూలై 19: గత డిశెంబరులో యిచ్చటి సెంట్రల్ జైలు నుండి తప్పించుకొని పారిపోయిన కమ్యూనిస్టులలో నొకడైన చింతా సత్యనారాయణదాస్ (రామచంద్రపురం) ను నిన్న రాజమండ్రి పోలీసు సర్కిల్ ఇనస్పెక్టరు బన్సీలాల్, కడియం సబ్ ఇనస్పెక్టరు మిశ్రా కడియం గ్రామంలో అరెస్టుచేసిరి. కడియం కమ్యూనిస్టువర్కరు బి. సూర్యారావు అనువతని యింట్లో దాస్ వున్నట్లు తెలిసి పోలీసువారచ్చటకు వెళ్లగా అతనచ్చటినుండి పారిపోవ యత్నించెను. ఇంతలో కడియం సబ్ఇనస్పెక్టరు మిశ్రా సత్యనారాయణదాస్‌ను పట్టుకొన యత్నించగా అతను తనమొలలోనున్న బాకుతీసి పొడవబోయెను. ఈలోగా మరొక పోలీసు గూడ వెళ్లి సబ్ఇనస్పెక్టరుకు సహాయము చేయుటతో యిద్దరూ కలసి అతనిని పట్టుకొనిరి. కమ్యూనిస్టు నాయకుల ఫోటోలు, గ్రంథాలుకూడ వశపర్చుకొనబడినవి. (స్వ. వి.)

# లండన్ రేవు సమ్మెదార్లకు డాక్ బోర్డు హెచ్చరిక

## బ్రిటిష్ ప్రభుత్వ ఖండన

లండన్, జూలై 20: రేపు పొద్దుటికల్లా బ్రిటిష్ రేవుల్లో సమ్మెచేస్తున్న రేవుపనివాళ్ళలో ఏ యూనియనుకీ చెందని 15,441 మందీ పనిలో ప్రవేశించాలనీ, లేకపోతే పని ఉన్నా లేకపోయినా వారానికి 4 పౌన్లు 8 షిల్లింగులు రిజిస్టర్ చేసుకుని పనికి హాజరైన పనివారందరికీ ఇప్పించటానికి వేసిన పథకం నిలిపివేయబడుతుందని నేషనల్ డాక్ లేబర్ బోర్డ్ నిన్న సాయంత్రం ఒక హెచ్చరిక చేసింది. కాని అర్ధరాత్రికల్లా లేబర్ ప్రభుత్వం దీనినిఖండిస్తూ, బోర్డుకి అవిధంగా ఆదేశం ఇవ్వటానికి అధికారం లేదనీ సమ్మె వ్యవహారాన్ని చూస్తున్న ప్రభుత్వ అత్యవసర సంఘంతో డాక్ లేబర్ బోర్డ్ సంప్రదించలేదనీ, రిజిస్టర్ అయి పనికి హాజరైన పనివాళ్లకు పని ఉన్నా లేకపోయినా కూలిచ్చే పథకం నిలుపుచేయబడదనీ ప్రకటించింది.

ప్రభుత్వం తీసుకున్న చర్యవల్ల సమ్మె బ్రిటన్ రేవులన్నిటికీ వ్యాపించే ప్రమాదం తొలగిపోయింది.

ప్రభుత్వ ప్రకటన వెలువడ్డ మీదట డాక్ లేబర్ బోర్డు అధ్యక్షుడు లార్డ్ ఎమన్ ఒక ప్రకటనచేస్తూ తమ బోర్డు ప్రభుత్వ అత్యవసర సంఘానికి లోబడిలేదని అంటూ, చక్కబడబోతున్న పరిస్థితులను ప్రభుత్వం ఇట్లాఎందుకు చెడగొట్టిందో అర్థంకాకుండా ఉన్నదనీ అన్నాడు. తమబోర్డు సమ్మెలను భగ్నం చేసే సంస్థకాదని అన్నాడు.

డాక్ లేబర్ బోర్డు ప్రకటనవల్ల దేశమంతటా రేవుపనివారల్లో తీవ్ర క్రోధ విద్వేషాలు ప్రబలగలవన్న భయంతో ప్రభుత్వం పైవిధంగా ఆ ప్రకటనను ఖండించినదని ప్రభుత్వ సన్నిహిత వర్గాలు తెలియచేస్తున్నారు. ఈవేళ డాక్ లేబర్ బోర్డు ఒక సమావేశం జరిపినది. అధ్యక్షుడు లార్డ్ ఎమన్ ఈవేళ మధ్యాహ్నం ప్రధాని అట్లీని కలుసుకొని 20 నిముషాలసేపు సంప్రదించాడు. లార్డు ఎమన్ తన పదవికి రాజీనామా నివ్వక పోతే ప్రధాని బలవంతాన ఇప్పించవచ్చునని రాజకీయ వర్గాలు భావిస్తున్నారు.

నేడు కామన్స్‌లో ఈ విషయమై గంటసేపు తీవ్రచర్చ జరిగింది కార్మిక మంత్రి ఇసాక్స్ మాట్లాడుతూ డాక్ లేబర్ బోర్డు ప్రకటన పరిస్థితులను క్లిష్ట పరచిందని అన్నాడు.

24 రోజులనుంచీ జరుగుతున్న సమ్మె ముగుస్తుందా లేదా అన్న విషయాన్ని నిర్ధరించగల సమావేశం ఒకటి ఈవేళ ఇక్కడ జరిగింది. రేపు మళ్ళీ సభ జరిపి సమ్మె ముగించటానికి గల వీళ్లను పరిశీలిస్తామని సమ్మె దారులలో కొన్ని వర్గాల వారు అందులో నిర్ణయించారు.

సమ్మెను నడుపుతున్న నాయకుల సంఘం లేనివాళ్లు దృఢంగా ఉన్నారని ప్రకటించింది. గోథెన్ బర్గ్ (స్వీడన్) రేవులోఉన్న 8 బ్రిటిష్ నౌకల నావికులు తాము పనివారితో ఒకటేనని తంతి నిచ్చారు.

పారిస్ నుంచి కమ్యూనిస్టు ట్రేడ్ యూనియన్ ఫెడరేషన్ తన సభ్యులందరికి ఒక ఆదేశాన్ని ఇస్తూ, బ్రిటిష్ రేవుల్లో పోలీసులు, సైనికులూ సరుకులెత్తిన నౌకల సరుకుల్ని ఫ్రెంచి రేవుల్లో కార్మికులెవరూ దించకూడదని హెచ్చరించింది.

# చిలకడదుంప సాగు

బొంబాయి, జులై 20: చిలకడదుంప కర్రపెండలం, అరటిపళ్లు సాగుఅవుతున్న భూముల విస్తీర్ణాన్ని పెంచాలనీ, ఈ మూడు పంటలనూ అభివృద్ధి చేయడానికి ప్రతివానికీ ఒక డెవలప్‌మెంట్ ఆఫీసర్‌ని నియమించాలనీ భారత ప్రభుత్వ అదనపు ఆహారోత్పత్తి సంఘం నేడిక్కడ సమావేశమై నిర్ణయించింది. ఈ ఉద్యోగులు రాష్ట్రాల్లో పర్యటించి వ్యవసాయదారులను కలుసుకుని ఉత్పత్తి పెంచేవిషయమై సలహాలిస్తారు. కొత్తగా ఈ పంటలను వేసిన భూముల్లో పండిన పంటనంతటినీ నిర్ణీత ధరలకు కొనివేయటానికికూడా ఈ సంఘం నేటి సమావేశంలో నిశ్చయించింది.

సాగుబడిని విస్తరింప జేయటానికిగాను పరీక్షగా ముందు 5 వేల ఎకరాల్లో చిలగడ దుంపలను వేయించమని సంయుక్తరాష్ట్ర ప్రభుత్వానికి అనుమతి నిచ్చింది.

ఈ అదనపు ఆహారోత్పత్తిసంఘం మే నెలలో శ్రీరాం గారి అధ్యక్షతన నెలకొల్పబడినది. శ్రీ రామమూర్తిగారు మొదలైనవారు ఇందులో సభ్యులు. 1950 జూన్ లోపల అదనపు ఆహారోత్పత్తి విషయమై ప్రభుత్వానికి నివేదిక సమర్పిస్తుంది. ఈ ఏడాది అభివృద్ధి పథకాల నిమిత్తం ఈ సంఘానికి ప్రభుత్వం 10 లక్షలు మంజూరు చేసింది.

# చెన్నగరముపై ఆంధ్రుల హక్కు

## ఆంధ్రజిల్లా కాంగ్రెస్ తీర్మానం

చెన్నపట్నం, జులై 21: మదరాసు జిల్లా ఆంధ్ర కాంగ్రెస్ కార్యవర్గ సంఘము నిన్న సాయంత్రము శ్రీ బులుసు సాంబమూర్తిగారి అధ్యక్షతను సమావేశమై ఆంధ్రరాష్ట్ర నిర్మాణములో చెన్నపురి స్థానము విషయమై చర్చించిరి. ఇండియా ప్రభుత్వము ఏకారణంవల్లగాని మదరాసు నగరమును ఆంధ్ర తమిళ రాష్ట్రాల ఉమ్మడి ప్రధాన పట్టణముగా చేయుటకు అనుకూల పడకపోతే పనగల్ మంత్రివర్గము 1926 సంవత్సరములో సూచించిన రీతిని నగరమును రెండు భాగాలుగా విభజించి ఉత్తర భాగమును ఆంధ్రరాష్ట్రమునకు ముఖ్యపట్టణముగాను దక్షిణ భాగమును తమిళనాడు ప్రధాన పట్టణముగాను చేయవలెనని కోరుతూ కమిటీవారు ఒక తీర్మానము గావించిరి.

జాతీయ కాంగ్రెస్ జరుగ 1917 సం॥ లో మదరాసు రాష్ట్రకాంగ్రెస్ కమిటీ నుండి చెన్నగరమును ప్రప్రథమముగా ప్రత్యేకించినపుడు నగరముమీద ఆంధ్ర, తమిళ కాంగ్రెస్ సంఘాలకు ఉమ్మడి అధికారమొసగినదనియు 1920 సం॥లో భాషా సిద్ధాంతము ప్రకారము కాంగ్రెస్ రాష్ట్రాలు ఏర్పరచినపుడు కూడా అపద్ధతిని ఛాయపరచియుండెననియు తీర్మానము తెలిపెను. అప్పటినుండి యిప్పటివరకు ఉభయ రాష్ట్రీయ సంఘాలు అన్ని కాంగ్రెస్ వ్యవహారాలు కార్పొరేషను శాసనసభల ఎన్నికల వ్యవహారములు నిర్వహణ విషయములో ఉమ్మడి అధికారము వహించి పనులు సాగించుచూ వచ్చెననియు ఉభయరాష్ట్ర కమిటీలకు ఏర్పడిన తగాయిదాలను సయితం కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ పరిష్కరించి యీ విషయమును అంగీకరించె ననియు తీర్మానములో వివరింపబడెను.

రాష్ట్రీయ కాంగ్రెస్ సంఘాలు భాషా ప్రయుక్త సిద్ధాంతముబట్టి విడదీసినపుడు బొంబె నగరము ఒక ప్రత్యేక రాష్ట్ర కమిటీగా ఏర్పరుప బడెననియు, బొంబె నగరమును ప్రత్యేక రాష్ట్రముగా చేయవలెనని నాయకత్రయ కమిటీ యిపుడు సూచించుటకు కూడా అదే కారణము తెలుపబడెను.

మదరాసు, బొంబై నగరాలను ప్రత్యేక రాష్ట్రముగా చేయవలెనని థార్ కమిటీ చేసిన సిఫార్సులను నాయకత్రయ కమిటీ ఆమోదించనిపక్షములో తమిళ ఆంధ్ర రాష్ట్రాలకు మద్రాసునగరముమీద జాయింటు జూరిస్డిక్షను నొసగి నగరము ఉభయరాష్ట్రాల ముఖ్యపట్టణముగా నుండుట కొక విధానమును సూచించియుండవలెనని తీర్మానము ఉద్ఘాటించుచున్నది. ఇటీవల బరంపురములో ఆంధ్రుల కాంగ్రెస్ యుతమైన ఉరేగింపుపై ఓఢ్రులు గావించిన దౌర్జన్యమును ఖండించుచూ ఒరిస్సా ప్రభుత్వము అవిషయమై విచారణ జరిపి ఒరిస్సాలోని ఆంధ్రుల కష్టములు తొలగించవలెనని కోరుతూ మరొక తీర్మానము గావింపబడెను.

### శ్రీ ప్రకాశంగారు

మద్రాసు, జూలై 20: శ్రీ టి. ప్రకాశంగారు, ఢిల్లీనుండి నేడు సాయంకాలం మరలివచ్చిరి. మంత్రులపై ఫిర్యాదుల గూర్చితాము రాయబారం వెడలిన విషయమై ఏమైందని విలేఖరి అడుగగ, ఏమి చెప్పననిరి.

"ఈవిషయం సర్దారు పటేలుగారు పరిష్కరింప అధికారమివ్వబడినదని తెలియుచున్నది. వారు మద్రాసు ప్రధానితో సంప్రదించి చేయవలసింది చేస్తారని ఆశించుచున్నాను" అని మాత్రం దెలిపిరి.

### డిటెన్యూవిడుదల

మదరాసు, జులై 20: మదరాసు ప్రజారక్షణచట్టముక్రింద నిర్బంధించబడిన కర్నూలుజిల్లా కమ్యూనిస్టు వడ్డె సోమన్నను విడుదలచేయవలెనని ప్రభుత్వం వుత్తర్వుచేసినది.

### వరవిక్రయం నాటక ప్రదర్శనం

మద్రాసు, జులై 21: సుగుణవిలాస సభసభ్యులు 23వ తేదీ శనివారం సాయంత్రం 6 గం. లకు విక్టోరియా పబ్లిక్ హాల్ లో 'వరవిక్రయం' నాటకమును ప్రదర్శించెదరు. సభ్యులకుమాత్రమే ప్రవేశము.

# శాసనసభలకు స్వతంత్ర కార్యాలయములు

## రాజ్యాంగరచనా సంఘములో చర్చ

న్యూఢిల్లీ, జులై 20: ప్రజా ప్రతినిధి పరిషత్తు రాజ్యాంగ రచనా సంఘము నేడు ఉదయము డా॥ బి. ఆర్. అంబేద్కరు గారి అధ్యక్షతను సమావేశమయ్యెను. చిత్తు రాజ్యాంగ విధానమునందలి షెడ్యూల్సులోని ఆటవికజాతుల పట్టికపై అసాం ప్రధాని శ్రీ గోపీనాథ బోర్డొలాయ్‌గారు తన అభిప్రాయములను సంఘమువారికి తెలిపిరి. ఈ పట్టికలో కొన్ని జాతుల పేర్లు కలపవలెనని బోర్డొలాయ్ గారు సూచించినట్లు తెలియుచున్నది.

1941 సం॥ జనాభా లెక్కల ననుసరించి అసాములో ఆటవిక జాతుల సంఖ్య 24,20,956 అనగా ఆ సాము మొత్తం జనాభాలో 100కి 32 5 వంతులు.

ఠక్కర్ బాబాగారు కొంచెము అస్వస్థులుగా నుండుటచేత రాజ్యాంగ రచనా సంఘమువారు వారి యింటికివెళ్లి ఈ ఆటవికజాతుల పట్టిక విషయమై వారితో చర్చించిరి. ఠక్కర్ బాబాగారు హరిజన సేవా సంఘాధ్యక్షులు. 30 ఏండ్లనుండి వీరు ఆటవికజాతులకు సేవచేయుచున్నారు. వారి సమస్యలు ఠక్కరు బాబాకు బాగా తెలియును.

### పార్లమెంట్లకు స్వతంత్ర కార్యాలయములు

నేటి మధ్యాహ్నము రాజ్యాంగ రచనాసంఘమువారు స్పీకర్లకు స్వతంత్ర కార్యాలయములు నేర్పరచు విషయమై చర్చ జరిపిరి. సం॥ రా॥ శాసనసభ స్పీకరు పురుషోత్తమదాస్ టాండన్, సి. పి. ఎసెంబ్లీ అధ్యక్షుడు జి. ఎస్. గుప్తా, బొంబాయి ప్రధాని శ్రీ బి. జి. ఖేర్ గారలు చర్చలలో పాల్గొనిరి.

భారత పార్లమెంటు కార్యాలయ స్వాతంత్ర్యమునకు రాష్ట్రీయ శాసనసభల కార్యాలయములస్వాతంత్ర్యమునకు సంబంధించిన సమస్య నేడు రాజ్యాంగరచనా సంఘ మధ్యన్న సమావేశములో చర్చకు వచ్చెనని భారత యునైటెడ్ ప్రెస్ వారు తెలుపుచున్నారు.

ఇండియా ప్రభుత్వ లెజిస్లేటివ్ సెక్రటరీగానుండిన సర్ బన్‌స్లాల్ గ్రాహాం నకును అప్పుడు భారత శాసనసభాధ్యక్షుడుగానుండిన శ్రీ వి. జె. పటేలునకును చరిత్రాత్మకమగు సంఘర్షణ జరిగినదాటినుండి ఈ విషయమునకు రాజ్యాంగ ప్రాముఖ్యము కలిగెను. ఇందుకు సంబంధించిన వస్తుకు (ఆర్టికిల్) ఇండియా ప్రభుత్వ న్యాయశాఖమంత్రి డా॥ అంబేడ్కరు, సి. పి. ఎసెంబ్లీ అధ్యక్షుడు జి. ఎస్. గుప్తా గారలు నోటీసిచ్చిన సవరణలపై చర్చ జరిగెనని తెలియుచున్నది.

రాజ్యాంగరచనాసంఘ సభ్యులుగాక, బొంబాయి ప్రధాని శ్రీ బి. జి. ఖేర్‌గారు, సం॥ రా॥ శాసనసభాధ్యక్షుడు శ్రీ పురుషోత్తమదాస్‌టాండన్, సి. పి. శాసనసభాధ్యక్షుడు శ్రీ ఘనశ్యామగుప్తాగారలు చర్చలలో పాల్గొనిరి. ఈసమస్య విషయమై తుది నిర్ణయము జరుగలేదని తెలియుచున్నది.

రేపు సంఘమువారు రాష్ట్రీయ ప్రధానులను కలిసికొని భారత యూనియను సంస్థానముల మధ్య అధికారముల విభజన విషయమై చర్చించెదరు. రాజ్యాంగవిధానములో ఈ అధికారములను నిర్వచించు పట్టికలు మూడుండును. ఇవి యూనియను పట్టిక, రెండు కంకరెంటుపట్టిక, మూడు సంస్థానముల పట్టిక.

# అనుమతి పత్రాలు లేకుండా ఇండియాకు పోవద్దు

## పశ్చిమ పాకిస్థానీలకు ఇండియా హైకమిషనర్ హెచ్చరిక

కరాచీ, జులై 19: అవశ్యమగు పత్రాలు లేనిది పశ్చిమ పాకిస్థాన్‌నుంచి ఎవ్వరూ ఇండియాకు పోకూడదని పాకిస్థాన్‌లోవున్న ఇండియా హైకమిషనర్ ఒక ఉత్తర్వు జారీచేశారు.